1-9-80

# కె. శివారెడ్డి

కవితా సంపుటి

# నేత్రధనుస్సు

*NETRA DHANUSSU*

Colletion of Poems



Publishers
'JHARI' POETRY CIRCLE

*FIRST PUBLISHED*

Nov 1978

*COVER DESIGN*

SEELAVI

*Printers*

Sri Varalakshmi Press
Khairatabad-Hyd-4 Phone : 34711

*Price* : *Rs. 3-00*

*For Copies*

Desi Book Depot
Narayanaguda
Hyderabad

Navayuga Book House
Sultan Bazar, Koti
Hyderabad-500 001

# ధ్వంసం

ధ్వంసం చేయాల్సిన దాన్నే ధ్వంసంచేసి
మరో మహత్తరమైన దాన్ని చెమటతో కడతాం...
చుట్టూరా శ్శే అంగరక్షకుల్లా విస్తరించివుంటే
నదీజలాలని భ్రమించి మోజుపడటం వెర్రి.
దేన్నీ ధ్వంసంచేయకండా
        దేన్ని నిర్మిస్తావు ?
ధ్వంసం చేయతగిందేదీ లేకపోతే నీకీలోకంలో
నువ్వు తప్పకుండా ధ్వంసం చేయతగిన వ్యక్తివి.

# వజ్రగీతం

చీకటివాసన మూచిన గాలిని మేసేస్తే
రాత్రిలాగా శీతలమెక్కిపోదూ మనసు...
కళ్ళు దృశ్యాల్ని పడకట్టినట్లు
ఊపిర్నికూడా పడబోసుకోవాలి...
వెలుగు వేళ్ళకి ఎక్కడన్నా
చీకటిమరకలున్నాయేమో చూచుకోవాలి–
శబ్దాన్నిగూడా పుటంపెట్టి పరీక్షించుకోవాలి.

నీకు పనికిరానిగతం నిన్ను వెంటాడుతుంది....కాచుకోవాలి
మనభ్రమలు మనల్ని మైమరపింపచూస్తాయి–గిల్లుకోవాలి.
ఆవు పొదుగులాంటి మేఘాలను ఆకాశం దాచుకున్నట్లు
నిత్యపమరశీల జీవితాన్నిగూడా పరిరక్షించుకోవాలి....

ఎలాగో బతకటం వేరు
వెలుగుతూ బతకటం వేరు
వెలుగు ఎలుగెత్తి బతికే బతుకు
కటకటాల వెనకగూడా కాఠిన్యం కోల్పోని వజ్రగీత సంగీతం

15–11–77

# చూపు

ఆకుల్లో ఆకాశాన్ని
ఆకాశంలో అడవుల్ని చూడలేనివాడు
మనుషుల్లోని మహత్తర ఆకాశ అటవీసౌందర్యాల్ని చూడలేడు
రోడ్లలో నదుల్ని
నదుల్లో నవచైత్రపథాల్ని చూడలేనివాడు
మనుషుల్లోని నవనవోన్మేష ఆశావసంతోత్సవాన్ని చూడలేడు.
మొనదేలిన గరికపోచలో పిడిబాకునీ
'నల్లమేఘం రవిక' వెనక 'రవిస్తనాన్ని' చూడలేనివాడు
మనుషుల్లోని తిరుగుబాటు పొద్దుటిపూటల్ని చూడలేడు
వాడికి
కుక్కపిల్ల కుక్కపిల్లే
నాకు అనంత ఆర్తనాదం
వాడికి
బానిస బానిసే
నాకు బానిస ఎక్కుపెట్టిన విల్లంబు
వాడికి
మట్టి మట్టే
నాకు మట్టి కవిత్వం

15-11-77

# కవిత్వం

భ్రష్టుడు! శబ్దంలోగూడా వ్యభిచరిస్తున్నాడు
మంటలేని ఆ దుఃఖమెందుకు వాడికళ్ళనిండా
కర్రకాళ్ళు కదలినట్లు శబ్దాన్నిమాత్రమే
మోయించుకుంటూ వెడతాడు తప్ప
స్పర్శతో భూమిగుండెని మేల్కొల్పటంలేదు

ఒకడు గీతాన్ని బొచ్చెగా చేసుకుని
అనునిత్యం అడుక్కుంటాడు
పచ్చదనం పూసుకుంటాడు.
మరొకడు తనే గీతమయి పారపుచ్చుకెళ్ళి
పొలంలో దమ్ముచేస్తాడు

8-12-77

# కాంతిరేఖ

శబ్ద సముద్రం మధ్య మునిగిన నాకు
ఏకాంత పునరావాసం కావాలి
నన్ను నేను దర్శించుకుంటానికి
నన్ను నేను ఆవిష్కరించుకుంటానికి....

కాంతి పాదాల సవ్వడులు నిండిన శబ్దమే
నాలోనూ కదులుతోంది
గాలినిండా జీవన శ్రుతుల్ని నింపిన
కాంతి కరాంగుళుల అలవోక కదలికలే
నాలోనూ చిత్రాలు గీస్తాయి
నా నేత్రాల్నిండా రోడ్లు వేస్తాయి

నా రక్తం నిండా జనాన్ని ప్రవహింపచేస్తాయి.
ఒక ఏకాంత లిప్త.
ఒక ఏకాంత నిశ్శబ్దం కంటివెలుగు కావాలి
ఆకాశంతో చెట్లు చేసే భాషణ
మట్టితో మనిషి చేసే సంభాషణ వింటానికి.

అవును
నేను నా గుండె లయ వింటాను
గుండెనిండా ఒదిగిన ప్రపంచ జన ఘోష వింటాను
రోడ్డవశల చేయెత్తి పిలిచేవాడి కంఠస్వరం
ఇక్కడ నా నది ఒడ్డున కూర్చుని వింటాను.
శబ్ద సముద్రం మధ్య

ఏకాంత ధ్యాన ముద్ర.
నిమీలితాక్షుల కొసలమీంచి జారే
శబ్దాల కాంతిరేఖలు–పల్లెల్లో
మేలుకొలుపుల పొద్దుపొడుపులు

25–1–76

# బతకటం!

దుఃఖం కోసినప్పుడు బతుకుతాను
గుండెల్లో గానం పొడిచినప్పుడు బతుకుతాను
బతుకు పొట్టమీదుగా చక్రం వెళ్ళిపోయినప్పుడు
ముసురుగా సాగుతున్న రోదన
వెంటాడి వేటాడినప్పుడు బతుకుతాను....
వచ్చీరానీ మాటల పిల్లల పక్షులు
బజారు గూళ్ళలో కొట్టుకుంటుంటే
కళ్ళనిండా చెట్లతో ఒంటినిండా దేశంతో
సదాబతుకుతాను.

3-4-78

నేత్రధనుస్సు శివారెడ్డి కవిత

# శరీరం

ఎంత అందమైన మాంసం....శరీరం
ఇంత అందమైన మాంసం
అద్దంలా ఉండాలికాని, ఉదయం నీళ్ళగ్లాసులా ఉండాలికాని
మసిబొగ్గులాని స్తేజంగా మాత్రంకాదు

17-10-1977

# ఉనికి !

నరికి ఎండలో పారేసిన
చెట్టు మొదలు ఎ సంగీతమూ విన్పించదు
తగలబడేటప్పుడు మాత్రమే
అగ్ని సంగీతాన్నాలా పిస్తుంది.
మొదట ఏదీ సంగీతం విన్పించదు
తనకు తానుగా బతికేటప్పుడు
అది చేసేది రొదమాత్రమే...
తన ఉనికిని నలుగురికోసం ఆహుతి కావించినపుడు మాత్రమే
గాలికన్న మిన్న జీవన సంగీతమున్విస్తుంది.

18-1-78

# నా అక్షరం

నన్ను గుంటపెట్టి తవ్విపోస్తున్నాడు.
ఆ కుర్రాడు
నన్ను గుంటపెట్టి తవ్విపోస్తున్నాడు
నేను సముద్రమయ్యేంత వరకు—
ఏ స్టేజి దగ్గరెక్కడో తెలియదు — బస్సు—
నే నిటు తిరిగేసరికి— తనటు బయటికి ముఖం పెట్టి
ప్రపంచాన్ని జల్లెడ పట్టేస్తున్నాడు—
పిర్రల దగ్గర చివిగిన చడ్డీ
గూళ్ళమీదా వెనకా పిగిలిన షర్టు
పాత చినుగుల్ని మూసిన రెండుమూడు నిలువు కుట్లు—
ఏదో ఒక స్కూలు యూనిఫామ్—
కూరల్లోకి తలా ఒక రెమ్మా తుంచుకెళ్ళితే
మిగిలిన కరేపాకు మొక్కలా వున్నాడు—

ఎన్ని కెరటా లెన్ని కెరటాలు నన్ను తాకాయి...
అంట్లుతోమే ఏ వెంకమ్మ కొడుకు వీడు
రోడ్లూడ్చే ఏ మైసమ్మ బిడ్డవీడు
ఎదురు తిరిగి సమ్మెకట్టి మరణించిన కార్మికుడు
ఏ సుబ్బయ్య కొడుకు వీడు
నేను వాణ్ణి చూస్తున్నంత సేపూ
బయటికే చూస్తున్నాడు కదిలే ప్రపంచానికేసి—
పూర్వపు నీటి ధారల చారలు మిగిలిన
చిన్న కొండలా వున్నాడు
నన్ను మొలకెత్తుతున్న విత్తనాల భూమిని చేసి

మరుక్షణంలో మాయమైన కుర్రాడా!

నువ్వనాధవైతే ఈ దేశం అనాధ
నువ్వు దరిద్రుడవైతే ఈ దేశం దరిద్ర—

ఒరే! నాయనా! నాకాయితాల మీదుగా నడిచిపోరా
నీ పదముద్రల్ని నా గీతాలుగా కూర్చుకుంటా—
గుండెనిండా శ్రీకాకుళాలు నినదించిన
గీత చరణాలే నీ చరణాలు—

నన్ను సముద్రంచేసి, నన్ను భూమినిచేసి
నన్ను అడవినిచేసి
వెళ్ళిపోయిన కుర్రాడా! నువ్వు నా అక్షరానివి!

15-4-78

# చేతుల్లేని ఆ బాధ

చేతుల్లేని ఆ బాధ
తన గుండెలోని నీళ్ళనెలాతోడి మనకి పోస్తుంది
చేతుల్లేని ఆ బాధ
తనలోని విషాదాన్ని మన గుండెల మీద ఎలా చిత్రిస్తుంది
చేతుల్లేని ఆ బాధ
తన కన్నీటి బిందువుల్ని ఏరి పున్నాయి పువ్వుల్లా
మనముందు పోసి ఎలా చదువుకోమంటుంది.
చేతుల్లేని ఆ బాధ
ఈ రోడ్లమీద దుమ్ముని దోసిలితో ఎత్తి మన కళ్ళల్లో కొట్టి
మన కళ్ళచూపుల పేజీలు మడతపడి దారి మూసుకున్న బాధలో
దాని బాధనెలా అందచేస్తుంది
చింత బరికె చేత్తోబట్టుకుని మన వళ్ళంతా వాయగొట్టి
పుళ్ళ సలపరపు సూదులు గుచ్చటంలో—తన మనసుపడే
క్షోభ— యమయాతననెలా తెలియచేస్తుంది

చేతుల్లేని ఆబాధ ఒక మహా సముద్రం
కళ్ళులేవి మనముందు
చేతుల్లేని బాధా సముద్రాలు
కళ్ళ చేతుల్తోనే ఈ బాధా సముద్రాల్ని
ఎత్తి మన గుండెల్లో పెట్టుకోవాలి
కానీ
కళ్లులేవి మన ముందు
మాటల చేతుల్లేని చిన్న పిల్లల మహా సముద్రాలు

12-11-76

# విత్తు మొలకెత్తిన తరవాత

విత్తు మొలకెత్తిన తర్వాత
డిప్ప పక్కనే పడిపోతుంది—
ఆ డిప్పల్లాంటి చనుమొనల్తో
ఏవీలేని ఖాళీగోనె సంచుల్తో ఆమె

ఆమె ఎవరికి కావాలి?
గాలి కూడా మూచ్చూదకండా పోతోంది
రాత్రికూడా తాక్కుండా జాగ్రత్త పడుతుంది.
అవసరం లేకపోతే
డిప్పల్లానో ఆకుల్లానో పూవుల్లానో
అంగాలు రాలిపోతే బాధలేదు—
ఇక్కడంగాలు వేళ్ళాడతాయి
చీమిడిలా అసహ్యంగా వేళ్ళాడతాయి.

వేళ్ళాడే అంగాలు బువ్వపెట్టవు.
ఫుట్‌పాత్‌ల నిండా డిప్పలే, డిప్పలు

20—10—78

# కంట్లోని నదులు చస్తే

కంట్లోని నదులు చస్తే
కన్ను భూగోళమెలా అవుతుంది
చాక్‌పీస్ నిర్జీవ వస్తువే
కానీ
బోర్డుమీద రాసేటప్పుడు మాత్రం
అది బతుకుతుంది అక్షరమై —
కలమూ అంతే
కాయితంమ్మీద పద్మాసనం వేసుక్కూచున్నప్పుడు
లోకాన్ని పునః ప్రత్యక్షం చేస్తుంది విశ్లేషణతో —
అంతే
కొన్ని నిర్జీవాలైనా
పచ్చగా బతుకుతాయి ఉపయోగంలో
కొన్ని బతికున్నా చచ్చిపోతాయి నిరుపయోగంలో
మనుషులూ అంతే

24—12—77

# మూడుగంటల ముష్టి పేపరుతో

మూడుగంటల ముష్టిపేపరుతో
వీళ్ళ కలల్ని కోర్కెల్ని అంతర్నిబిడీకృత చైతన్య ప్రపంచాల్ని
వీళ్ళ కన్నీళ్ళని కనపడని గాయాల్ని దరిద్రంబరువుతో
వస్తువులైన వీళ్ళబతుకుల్ని ముళ్ళతెరువుల్ని
గుప్పిళ్ళల్లో బిగుస్తున్న క్రోధాల్ని, వాళ్ళకే తెలియని
వాళ్ళు తేబోయే విప్లవాల్ని, మార్పుల్ని
వీళ్ళ రక్తసంగీతాల్ని జాతివసంతాల్ని
కళ్ళల్లోనే మిగిలిపోయిన వాళ్ళ తల్లిదండ్రుల
అన్నాతమ్ముల అక్కాచెల్లెళ్ళ ఆశల ఆటవీటాటల్ని
మూడుగంటల ముష్టిపేపరుతో కొలవటమెలా?

కాలే ఇనుముమీద బడ్డ ముత్యపు నీటిచుక్కల్లా వీళ్ళు
బెంచీల వధ్యశిలలమీద జీవితాల ఉదయాలవాళ్ళు
వీళ్ళ రేపటి ప్రతిభా ప్రభాతాల్ని
తిరుగుబాటు సంచలన సంచయాల్ని
తేబోయే చారిత్రక మలుపుల్ని, స్వర్గసీమల్ని
నేత్రాల పచ్చికబయళ్ళని, రుధిరానల ప్రవాహాల్ని
ముష్టి మూడుగంటల శవకాలంతో కొలవటమెలా?

నా కెందుకో వీళ్ళంతా
రాత్రిమీద ఉదయం పాదాలతో నడుస్తున్నట్లు
తుపాకులు బుజానేసుకుని రేపుని దర్శించటానికి
అనంతయాత్ర చేస్తున్నట్లు...

నాకెందుకో వీళ్ళంతా ఉద్ధతులుగా
పట్టలేని ఆనందాలుగా, పగులుతున్న కోపాలుగా....
వీళ్ళు కలలకత్తుల్ని ధరించి బయలుదేరారు
వీళ్ళకి తెల్సు-ముందుతరం జీవితాల్ని తోపుడుబళ్ళుగా
తోసుకుంటూ వంచిన తలఎత్తకుండా పోయిందని గుడ్డిదని

వీళ్ళు ఆలోచనల నాగళ్ళు
వీళ్ళంతా వీళ్ళంతా మగాళ్ళు
జీవితాల్ని నెత్తురు విత్తనాలుగా నల్దెసలా
చల్లుకుంటూ వెళ్ళబోయేవాళ్ళు
వీళ్ళని దేశంమీదకి వదలండి
మట్టిమీద దివ్య సౌందర్యలోకాల సంతకాలు చేయనీయండి
దేశమే వీళ్ళకి పేపరు
చరిత్రే పరీక్ష

20-4-77

# నయనం

సముద్రతీరంలా
రోడ్డుమీద నడుస్తుంటానా
భయంకర నిశ్శబ్దాన్ని మోసుకుంటూ అలలొచ్చి
నన్ను స్పృశించి, ఊపిరాడనంతగా కౌగలించి వెళ్ళిపోతుంటాయి
'ఏమిటీ మౌనం మాట్లాడండంటా,
నువ్వురాకముందు ఘనీభవించి వున్నాం
నీరాక తర్వాత మౌనచైతన్యంతో నాట్యమాడుతున్నాం
అన్నట్టుగా నన్నొకసారి కుదిపి వెళ్ళిపోతాయి...
ఉండండి! వాటి మౌనభాషణాన్ని ప్రసారంచేయనీండి
వాటి నిశ్శబ్ద విలయ సంగీతాన్ని నన్నాలాపించనీయండి-

చెట్లులేకపోతే అడవిలేనట్లుగానే
అలలు లేకపోతే నేను లేను
ఈ అలలు కార్ముకాలైతే నేను పొదిని
ఈ అలలు రూష్టదృక్కులైతే
నేను నయనాన్ని

22-4-77

# స్నేహం

చలి ఈ గదిని కౌగలించుకున్నాక
దీని వ్యక్తిత్వమే నశించిపోయింది.
కౌగిలింత ధర్మం వ్యక్తిత్వం హరించటమా
ఉనికిని ఉద్దీపింపచేయటమా?
రాత్రి ప్రతిదాన్నీ మింగేస్తుంది
ఎండ, గుండెలోన ఊహకి మాటలాంటిది
ఎండనది ప్రవహించినప్పుడు
ప్రతి వస్తువూ స్పందించి స్వేచ్ఛగా గొంతువిప్పుతుంది.
విద్యుద్దీపం వేసినప్పుడు చూడు
గది, ఎండచెమ్మ తగిలిన మొక్కలా తేజరిల్లుతుంది,
సహవాస ధర్మమూ అంతే_
గదిలేకపోతే వెలుగుకి నిబద్ధత లేదు
వెలుగులేకపోతే గదివ్యక్తిత్వం రుజువుకాదు
సావాస ధర్మమూ అంతే

18_1_78

# ఉదయం

ఉదయం నాకొక గొప్పనదిలా భాసిస్తుంది.
ఉదయం నాకళ్ళకు ఆక్సిజన్‌లా పనిచేస్తుంది.

నా శరీర మైదానాల పత్రహరితమంతా
అనంత వ్యామోహంతో పరవళ్ళు తొక్కుతుంది
పరిపూర్ణ ఆరోగ్యంతో వర్ధిల్లుతున్న కవిత్వంలా
ఉదయం నా రక్తమై ప్రవహిస్తుంది.

సమస్తజన జీవితాన్ని సమాదరించి తరలివస్తున్న
ఈ ఉదయం ముందు మోకరిల్లుతున్నా—
ఎవరు ఏం పారేసుకున్నా లెఖ్ఖలోకిరాదు-కానీ
ఉదయాన్ని వదులుకుంటే జీవితం వై దొలగిపోయినట్లే

సమస్త దీనజనుల పాదాల సవ్వడులు నిండిన
సమస్తకార్మికలోకపు వజ్రసంకల్పాల అగ్ని ప్రవాహాలునిండిన
ఆశల ఆనందోత్సాహాలు నిండిన
ఈ ఉదయంలో మునిగి పునీతుణ్ణౌతా
ఎవరు దేంతోనూ రాజీపడక
జీవితాంతం పోరాటం సాగిస్తాడో
వాడికి ప్రతీక అయిన ఈ ఉదయాన్ని
నాలోకి పీల్చేస్తున్నా

నాలోని అమావాసచీకటుల అసంబద్ధతని ఛేదించిన ఉదయమా!
నాలోని చావబోయే మొగ్గల్ని వికసింపజేసిన ఉదయమా!
నాలోని కీనీడల మరకల్ని నిర్మూలించిన భాసురోదయమా!

నాలోని ఒక్కొక్క అణువునుండి నాదమై వీస్తున్న ఉదయమా!
నా కరాంగుళుల్లో నిన్ను కేంద్రీకృతం చేసుకుని
నా అక్షరాల ద్వారా ప్రసరిస్తున్నా—

ఓ ఉదయమా! నన్నొక వాహకం చేసుకుని
నా జనులకి తగినంత స్తన్యాన్నియ్యవే!

# తుప్పర్ని రాలుస్తున్న రెప్పల్నడుగు

ఈ చేతులు ఈశరీరం
నన్ను ఊపిరాడ నివ్వవుగదా—
మోగే మృదంగ సముద్రంగుండె -
దూరాన్నుంచి మతం ఏడుస్తున్నట్లు
మసీదునుంచో చర్చినుంచో గుడినుంచో
మనం మోయనేవి శబ్దం గాలిమీద స్వారి -

పసిపాప కళ్ళకన్నా ప్రశాంతమైన ఉదయం కదా
దీనిమీద దుఃఖాన్నెందుకు పారబోస్తారు వీళ్ళు
ఉదయం కన్నా స్ఫటికమైన స్పృహమీద
ఏడ్పు బురదకాళ్ళతో పరుగెత్తట మేమిటి?

ఇంకా తలుపులు తెరుచుకోలేదు
తల్లి రొమ్మునుంచి పిల్లదూరం కాలేదు
చీకటింకా
దీపాల కాహార మౌతూనేవుంది

ఈ నిశ్శబ్ద సముద్రంలో ఇంకా
శ్వాసనదులన్నీ సంగమిస్తూనే వున్నాయి
శ్వాసతప్ప మరేమీ మేల్కొని లేని ఈవేళ
రైలు వస్తున్నట్లు నా ఆలోచన పసిగడుతుంది.
తన్లోకి తనే లయిస్తున్నట్టు రాల్తున్న తుప్పర్నడుగు—

రాత్రింబవళ్ళనీ ముడివేసే శ్వాసనిజమని నమ్ముతున్నా
గుండె పక్కగా నడచి వెళ్తున్నప్పుడు నీలో
ఒక మట్టిపెళ్ళ విరిగిపడటం నిజమైన బతుకని నేనునమ్ముతున్నా

ఉదయం సృజనగా మారుతున్నప్పుడు
రాత్రి చేతిని ముద్దు పెట్టుకొని వదిలేసి రద్దీలో కలిసిపో—
నిరంతరం తుప్పుర్ని రాసుళ్తున్న రెప్పల్నడుగు
గీతం ఏ మాటల పంచవారనుంచుందోనని                30-1-77

# యుగయుగాల వంచనకి గుర్తుగా

యుగయుగాల వంచనకి గుర్తుగా
ఈ రక్తం మరకని ఇక్కడే ఈ పేజీమీదే వదిలేస్తున్నా —
బలివితర్ధిమీద అమాయకపు గొర్రె
ఆర్తనాదం 'రక్తంమరక' శాశ్వతంగా కాలం పుటలనిండా
ప్రతిధ్వనిస్తూ తరతరాన్ని ప్రశ్నలముందు
బోనులో నిలబడేటట్లు చేస్తుంది.

దగ్ధమైపోతున్న త్యాగధనుడినుండి మంటతెగి
మన వ్యక్తావ్యక్తాల కంటుకుని
మనం నడుస్తున్న మంటలవుతాం —

తొలినాళ్ళలో ఎవడు గాయపరిచాడో
ఈ మెలకువ పిట్టని - తూర్పు దిక్కంతా
ఇప్పటికీ రోషకషాయిత నేత్ర అవుతుంది.
బాణం దెబ్బతిని తనముందుపడిన పిట్టని చేతుల్లోకి
తీసుకుని బుద్ధుడింకా నడుస్తూనే వున్నాడు —

ఎన్ని భూకంపాలు స్మృతుల దీవుల్లో
ఎన్ని ఆక్రోశాల వాయుగుండాలు ఆలోచనాసాగరాల్లో —
ఇంకా అక్షరాలు బతికి ఉండటానికి
కావ్యాలన్నీ ధ్వనిమయం అవ్వటానికి
ఆనెత్తుటి బొట్టు ఆవహించటమొక్కటే కారణం —

ఎవడు ఏ అక్షరన్నైనా ఎత్తి దాంట్లో
తనముఖం చూచుకునేటప్పుడు

తరతరాల గుండెల్లోని కలక—నెత్తుటిబొట్టు
ముఖం మీద కన్పిస్తుంది

నెత్తుటి బొట్టుముందు నెత్తుటిబొట్టు
నెత్తుటిపాట పాడుతుంది.

యుగయుగాల దోపిడీకి గుర్తుగా
ఈ నెత్తుటి బొట్టు ఎక్కడే ఈకాయితంమీదే
వెలిగినపదాన్ని మరో పదాన్ని వెలిగించమని వదలి వేస్తున్నా—

29—11—76

# పాదాలు

కొంతమంది చెడుగాలిలా వస్తారు
కొంతమంది పరిమళవీచికలా వీస్తారు.
మరికొంతమంది
ఉదయం కన్న హృదయంలా
ఆరోగ్యం వేళ్ళతో స్పృశిస్తారు.
ఎవరి పాదాలు నిన్ను పరిపక్వమైన నేలలోకి తొక్కి
కొత్తగా మొలకెత్తేట్టు చేస్తాయో
ఆ పాదాలు నా గీతాలు

2-6-78

# తొలకరి

నిన్నెలా పైకెత్తగలను
నారెక్కల మీద కెక్కించుకుని ఎలా పైకెగరగలను
వానకన్న బరువై, మంచుకన్న బరువై
చూపులేని కన్నుకన్న బరువైన నిన్ను
నారెక్కల మీద కెక్కించుకుని
ఎలా పైకెగరగలను.

వేళ్ళలో అక్షరాల శివరసం ప్రవహించని
కొండలా పాతేసుకున్న నిన్ను
ఎలా పెకలించగలను—
చీకటి గడ్డకట్టి ఉక్కుస్తంభంలా
భూమిలో కూరుకుపోయిన నిన్ను
నా చూపులకెరటాలు కుళ్ళగించగలవా ?

నీ శరీరంలో ఎక్కడన్నా తడుంటే నిన్ను పేల్చగలను
పేల్చి, నా తట్టకెత్తుకుని పైకెక్కగలను
రైళ్ళని నా ధనుస్సుమీద సంధించగలను
నువ్వు బతికుంటే - నా చంకనేసుకుని
భయంకర నిర్జనారణ్యాలు గడచి
'పాలిచ్చే పశువు మైదానం' పక్కలో పారేయగలను
నా భుజంమీద కెక్కించుకుని సముద్రాలు దాటి
ఆ కంటి ఒడ్డుమీద కూర్చోపెట్టగలను
మొలకెత్తని అక్షరానివై నన్ను వేధిస్తున్నావు
పండని కడుపు ఏకాకి తనమై నన్ను కాలుస్తున్నావు

నేత్రధనుస్సు శివారెడ్డి కవిత

నన్ను కానని గుడ్డితనమా ?
నన్ను పిలవని మూగతనమా !
నిన్ను మధిస్తేనే తప్ప
నిన్ను నా పారతో తిరగేసి
దమ్ముచేస్తేనే తప్పనాకు నిద్రరాదే -
నీ గర్భంలో ఒక కొత్తవిత్తు నాటందే
నాకు విశ్రాంతి లేదు. విశ్రాంతి లేదు, విశ్రాంతి లేదు

14-6-78

# దుఃఖం

నా దుఃఖాన్ని
మంచం మీదేసి పొర్లించి పొర్లించి తంతా—
అప్పుడప్పుడు నా దుఃఖాన్ని
నా శిరస్సున పెట్టుకుని ఊరేగుతా—

నా దుఃఖం నాకంట్లో నీరై
కాంతిని వడబోస్తున్న - కాంతిని కాపాడుతున్న
లాంతరుగ్లాసై - నన్ను బతికించి తను బతుకుతుంది.

# కాంతి పిట్టలా

కాంతి పిట్టలా నన్ను పొదుగుతుంది
నేను విస్వరనదిలో ఈదుతున్నా
పలుగుతో రోడ్డుని కుళ్ళగిస్తున్న ధ్వని నా నుదుట్లో
ఒకడెప్పుడూ ఇంకొకణ్ణి వెంటాడుతున్న దృశ్యం చెరగదు.
అలానే ఆ గంజాయి తాగటంలో నైతే ఎన్నో బొమ్మలు
ఎద్దు ముడ్డి బొడిచే ఆ చేయి ఎప్పుడూ చేలో మిగిలే మోడు—

తిరగలేని ఫాను అశక్తత నన్ను అశాంతి పాల్జేస్తుంది,
నాలోని సమస్త సృజనాత్మకతని పొట్టంకట్టి మీ కందిస్తున్నా
నాలోని సర్వ వేదనా విద్యుత్తుని తీగల గీతాలు మోస్తున్నాయి
నాకు సంక్రమించిందేమిటి ?
నా తలిదండ్రుల సుఖవ్యాధి వారసత్వ దుఃఖం తప్ప
నా భుజంమీదేసుకు మోస్తున్న గాడిద ఎన్ని యుగాల సంస్కృతి
అందుకే నన్ను నేను తగలేసుకుని శుచిమంతుణ్ణౌతున్నా—
నన్ను నేను తుంపులు చేసుకుని — విత్తనపు చెఱకుతుంటల్లా—
మీ ఆలోచనల సారభూముల్లో పునఃజన్మిస్తున్నా—
ఒక గడగా బతకటం మాని కణుపుకణుపుకీ మరో బతుకై —

15—6—78

# జైలు

కిటికీ కంట్లోంచి చూస్తే
చేతులెత్తి నిల్చున్న అస్థిపంజరాల్లా
ఆకు రాల్చిన చెట్లు
గది నిండా
ఊపిరాడని గాలి
పిచ్చికలా దారులు వెతుక్కుంటుంది—
స్పృహ నంతా
నిర్జీవ వస్తువులమీద పారబోసుకుని పాలలా
కలం అరచేత్తో ఎత్తి కాయితంలో నింపాలనే తపన—
ఎండిన ఏరుల్లా రోడ్లు—
ఆశలన్నీ యింకి కనుగుడ్లు లోనికిపోయి
శబ్దాన్ని మాత్రం మిగుల్చుకున్న రోడ్లు—
కరెంటు తీగలమీద చచ్చి వేళ్ళాడుతున్న కబోదుల్లా
రోడ్లూ—చెట్లూ—కలసి
గదిమీద దాడి చేస్తున్నాయో
గదే ఫోర్కు చేత్తో ఎత్తి
నోట్లో పెట్టుకుందో అర్థంకాదు
బండల్లా రాలుతున్న మాటలకింద
సృజనంతా సృజనంతా సృజనంతా—
గది గుండెంతా శిలామయమే
స్తబ్ధ నదులన్నీ శిలామయాలే
చూపుల్లేని చేతులన్నీ శిలామయాలే—
వర్షించని స్తనాలన్నీ శిలామయాలే
సీసాలో బంధించబడ్డ ఈగలా నా స్పృహ

17-1-77

# ఈ మేఘం

ఈ మేఘం అలా దూరాన వున్నట్టు వుంది
మరుక్షణంలో గుండెమీద వాలి కోడిపిల్లని పీక్కుతింటుంది
మేఘం సంగతి నాకు తెలియదా
కొండలాంటి వాణ్ణి గూడా తినేయాలని
వాడి తలచుట్టూ ముసురుకుంటుంది
కానీ వాడు చిరునవ్వుతో చెండాడివేస్తాడు
రూపంలేని మేఘం ఎన్ని రూపాలైనా ఎత్తుతుంది

పచ్చని పందిరిలా తయారయి
తన నీడని చేరిన వాళ్ళని భయంకర కార్నివోరస్‌లా
భక్షించి వేస్తుంది

మీరు మేఘాలయ్యారో
మీ కళ్ళు అనునిత్యం వర్షిస్తాయి
ఏడ్చేకళ్ళకు చూపుండదు
చూపులే లేనప్పుడు
ముందు చూపులేముంటాయి

29-11-76

# రొటీన్‌లో ఆత్మహత్యా!

చెమట బట్టిన చంద్రుడు
గ్లాసులో ఆత్మహత్య చేసుకుంటాడు
నాకంటే – గాలికి ఊగుతున్న
నా చొక్కాయే ఎక్కువగా బతికి వుందని నేననుకుంటా—
పోనుపోను నా శరీరం నాకే బరువై
మోయలేక కూలబడి
దాని బరువుక్రింద బడి నే చచ్చిపోతా—
కుర్చీల ఊబిలో దిగబడిపోతున్న నా చరిత్ర
బొదబొదలాడుతూ నామీద తలుపులు
మూసిన బురదమీద జ్ఞాపకాన్ని మిగల్చదు
ఖాళీపాత్రల్లాంటి శ్మశానాల్లో తుంతూగే
నా తలకాయకావ్యం భయాలు మూటగట్టి
నా మీదే విసిరేస్తుంది
దిక్కుమాలిన చంద్రుడు నాలో అస్తమిస్తాడు
తొమ్మిది నెలలూనిండి చచ్చిపుట్టిన బిడ్డలా
సూర్యుడు నాలో ఉదయిస్తాడు.

20_5_77

# కుర్చీలో మాంసం ముద్ద

కుర్చీలో మాంసం ముద్దకు కళ్ళు గుచ్చి
టీ కప్పు ముందు పెట్టి – పెదాలు కదపకుండా తాగమందాం–
కళ్ళులేని కళ్ళతో కప్పు ఛోరున వర్షిస్తుంది
లేని చేతుల్తో మాంసం ముద్ద ఓదారుస్తుంది.
కనపడని మనుషుల పాదాల ధ్వనులు మాత్రం
కప్పు చుట్టూ రాంభజన చేస్తూ – ముక్తి చూపించమని
గొడ్డు మోతు 'బేబులు ముందు 'పాషాణసరం' పడతాయి
సముద్రం ఒక గబ్బిలమై – వాలటాని కాధారం లేక
గదంతా కలయ తిరుగుతూ ద్వీపంలాంటి
మాంసం ముద్దవి ఎలటాని కుపక్రమిస్తుంది.
మోకు పేనినట్టు మనల్నెవరో పేనటం మన జీవితమయి పోతుంది
డైనమైట్ పేలటానికి పనికొచ్చే నిప్పు – ఈ
ముప్పేట మోకులద్వారానే ప్రవహిస్తున్నట్లు
మనం అనుభూతి పొందుతాం.
కుర్చీలో మాంసం ముద్ద – మాంసం ముద్దగా కాక
ఒక మహోనేత్రంగా వెలుగుతూ గదంతా
'ఫౌన్ టెన్'లా ధైర్యాన్ని చిమ్ముతున్నట్టు
మనం తేలిక పడతాం
మనమీద మనం స్వారి చేయటం ఆపినట్టు కలగంటాం

20–2–77

# నా కళ్ళు పునర్జన్మ నెత్తుతాయి

నా కళ్ళు పునర్జన్మ నెత్తుతాయి
నా దేహం వర్షాన్ని చూచిన బీటలుపడ్డ భూమి
అన్నాన్ని చూచినప్పుడు—
వడ్లదో పాచిపోయిందో బూజుపట్టిందో నీళ్ళుగారుతుందో
గిన్నెలోనో బండమీదో మట్టిలోనో కుండలోనో మరెక్కడో
అన్నాన్ని చూచినప్పుడు నా కళ్ళు
బావిలోని నీళ్ళలా జలజలా పొంగుతాయి
గొప్ప ఆనందంతో చలికాలం మంటలా తగలడతాయి—
అన్నం నా ప్రాణం నా ప్రేమ నా సర్వస్వం—
అప్పటిదాకా నా కళ్ళలోని ప్రాణమెటు పోయిందో
చేతుల్లోని నదులెలా ఎండిపోయాయో—
ఆ ఒక్క పిడికెడ ధాన్యంకోసం
ఎవణ్ణైనా ఖూనీ చేస్తా
భూమినే దొంగిలిస్తా—

1978

# నేత్రాల రోడ్లు

ఒక జల్లు పడిపోయిం తర్వాత కళ్ళు
శీతాకాలపు ఉషోదయం రోడ్లు—
పదిగంటల సమయం ఫ్రూట్ మార్కెట్‌లా
కదలినుడికారంతో గుండె
బజార్లో జారిపడ్డ చేరుమాలుమీద
కార్లు, రిక్షాలు సైకిళ్ళ పాదాల పాదాలు
రాక్షసి పాదాల ఉమ్ముల ఉమ్ముల మరకలు—
రోడ్డంతా రక్తమయమై ప్రాణాల మయమై
బాధల మయమై—
వారిజ నేత్రాల రోడ్లు - మీన నేత్రాల
నిర్నిద్ర నిశీధ నేత్రాల శూన్యపు గుహల నేత్రాల
నిర్జన నేత్రాల రోడ్లు రోడ్లు రోడ్లు—
ప్రవహిస్తున్న ఆకాశపు నీలినేత్రాల రోడ్లు - తారోడ్లు
ఒక జల్లు పడిపోయిం తర్వాత కళ్ళు
జలదసరిత్తుల రోడ్లు—
దేశమంతా అల్లుకున్న
ఒక చేతి అయిదువేళ్ళ అసంఖ్యాక
శీతకాలాల ఉషోదయాల రోడ్లు—
నేత్రాల రోడ్లు - నేత్రాల రోడ్లు.

## ఓ నా తల్లులారా!

ఆ శిల
హాయిగా తింటుంది, తిరుగుతుంది
నిశ్చింతగా
నిస్తరంగంగా నిద్రిస్తుంది
ఎవడు దానిమీద స్వారిచేసినా
దానికే బాధా లేదు
ఎవడు దాని ముఖం మీద
ఉచ్చ పోసినా సిగ్గులేదు
పైన సూర్యుడు మాత్రం
దాన్ని జూచి పకపకా నవ్వుతాడు__
ఓ నా దేశం తల్లులారా!
మీరు గొడ్డుమోతులుగా నైనా ఉండిపోండిగానీ
శిలల్ని మాత్రం కనొద్దు.

# ఆ కన్నీళ్లు నావే

ఆమె ఎవరైతే ఏం
ఆ కన్నీళ్లు నావే
ఆమె ఎవరైతేం
ఆ ఆవేదన నాదే—
ఆమె ఎవరైతేం
ఈ దేశంలో పుట్టింది
ఆమె ఎవరైతేం
ఈ భూమ్మీద పడ్డది—
ప్రపంచం నరాల్లో
లయిస్తున్న వాణి
ఆమె నా కళ్ళలో
మలుపు తిరుగుతోంది
ఆమె అర్ధరాత్రిని
వెంటేసుకు పోతోంది
ఆమె చితుల్ని
వంటినిండా పేర్చుకు ఐతుకుతోంది
ఆమె వంటినిండా
మనిషి కాట్లు
ఆమె గుండెనిండా
ఆకలి గునపం తూట్లు—

ఆమె ఎవరైతేం
ఆమె నా ఆలోచన
ఆమె ఎవరైతేం
నా లోపలి అద్దంమీద చెరగని ముద్ర
ఆమె ఆనవాళ్ళు
నా అక్షరాల్నిండా ప్రత్యక్షం.

# నవ్వుల్లేని చేతుల్తో

నవ్వుల్లేని చేతుల్తో నన్నాహ్వానించి
నీడలేని నీ కళ్ళలో బజ్జోపెట్టుకుంటావు
పడిపోయిన పక్షిగూళ్ళలానో
విరిగిపోయిన కుర్చీ కాళ్ళలానో నీ చేతులు
ఏమిటి ?
నీ చేతులు, నీ తల, నీ కాళ్ళు, నీ కళ్ళు, నీ మొండెం
వేటికవే విడివిడిగా దూరంగా పడిపోయివున్నాయి –
ఎండుటాకులు రోజులు – నీ అంగాల చుట్టూ
గాలిలో తలుదూర్చి బావురుమని ఏడుస్తున్నాయి
నీ చేతులు - కెరటాలు తెచ్చి ఒడ్డున పారేసిన తెడ్లు
అలలు తాకిపోయే నీ చేతుల తెడ్లు చూచాకయినా
మునిగిపోయిన పడవనీ
సముద్రం లోతునీ తెలుసుకోలేనా ?

29-11-76

# జీవఫలం

కన్నుని గ్లాసులో ముంచి
టేబుళ్ళ వీపుమీద రుద్దుతాం -
మాటని గుండెలో మొలకగట్టి
పేపర్లమీద చల్లుతాం —
జన్మనిచ్చేది ఒక్క యోని మాత్రమే కాదు
కలాలూ, కళ్ళూ, టేబుళ్ళూ, స్తంభాలూ. రాళ్ళూ, రాత్రిళ్ళుగూడా
ఈ అయోనిజం మధ్య దీప స్తంభం - నేను
అరచేతిలో ఆకాశమూ అంబుధీ కలసి పడుకుంటాయి
అందుకే అరచేతి పాయలు పాయలుగా ప్రవహించి
భూమిని బంగారం ముద్ద చేస్తుంది
నిజానికి ఈ చేయి చెట్టు జీవఫలమే భూమి.

22-5-78

నేత్రధనుస్సు శివారెడ్డి కవిత

# నేరం

దీర్ఘ కాలిక వ్యాధుల్లో మనం పిల్లల్ని నాటి
వాళ్ళకి మన జీవన భయాలు, పిరికితనాలు
వెధవాయిత్వాలు, దొంగనవ్వులు, కక్కుర్తి బతుకులు
పాసిన గుణాలు, యింకా సవాలక్ష అవలక్షణాలు
వాళ్ళకి సంక్రమిస్తే, గర్వంతో ఆనందంతో
మనం జబ్బలు చరుచుకుని
వారసుల్ని చూచి మురిసిపోతాం—
పిల్లల కళ్ళు పొడిచేసి
అంధత్వమే వాళ్ళకి శ్రీరామరక్ష అని
జీవన కీకారణ్యంలో పిల్లల్ని వదలి
చేయదగ్గ గొప్ప కార్యం చేసినట్లు భావిస్తాం—
మనది మలినమైన రక్తం
విష కలుషితమైన తరం
వాళ్ళ ఉషోదయాల రక్తాన్ని మలినపర్చాలనీ
వాళ్ళ ఆలోచనల తిరుగుబాటుల్ని కాటేయాలనికాచుకుకూర్చున్నాం
గుడ్లమీద ఉచ్చపోస్తూ
సక్రమంగా
వాటిని పొదుగుతున్నట్లు సిద్ధాంతీకరిస్తాం.

# పిలుపు!

ఎవరన్నా
రాకపోతారా అని
తలుపులు తెరిచే ఉంచాను

ఎప్పుడూ
తెరిచే ఉంటాయి
అందరినీ ఆహ్వానిస్తూ—

పల్లవాల్లాంటి పాదాల్తో
అతిమృదువుగా గాలిలా
తరలివచ్చి నా ఇంటిని పావనం చెయ్యక పోతారా అని—

ఎవరన్నా వచ్చిన
చిరునవ్వు అలికిడి
నా ఏటి నిశ్శబ్దం మీద ఒక్కరాయి విసిరితే
స్తబ్దతంతా విరిగి
వాన్లో తడిసిన పాత ఇంటిమట్టి గోడలా" కూల్తుందని—

ఎల్లప్పుడూ
తలుపులు తెరిచే ఉంచుతాను
ఆ దారిని పోతూ ఎవరన్నా
ఒక్క చూపు విసిరితే కిటికీలో గుండన్నా
నట్టిల్లంతా చూపుల మంటల్తో వెచ్చదనం పొందకపోతుందా అని

లోపల
ఒక్క పురుగన్నా లేని

కుర్చీలు, బెంచీలన్నీ ఖాళీగా ఉన్న
నిరీక్షణలో మునిగిన ఉద్యాన వనంలా
బాహువులెత్తి — యుగాల ఎదురు తెన్నుల్లో —
తలుపులు తీసి నిలబడి ఉన్నాను
ఉహుఁ ఎవ్వరూ రాలేదు — రాలేరా ?

ఈదురు గాల్లో
టప టప కొట్టుకుంటున్న ఆకుల్లా — రెప్పలు
అల్లల్లాడుతున్నా
శూన్యంతో నిండి, అంధకారంతో బండబారిన
కనుగుడ్లు లేని — గుంటలు పడ్డ లొట్టకళ్ల నావి —
ఎవరైతే మాత్రం ఎలా రాగలరు ?
కళ్లుంటే తప్పు, గుండెలుంటే తప్పు.

# నిదానంగా నిర్మించనీ

తొందరపడి కూలిపోయే దానికన్నా
నన్ను దీన్ని నిదానంగా నిర్మించనీ—

ఆ నీటి నక్కడ చేరనీ ధ్యానంలా
ఆదక్కడ సాంతం కూడినప్పుడు పగులుతుంది సూర్యుడిలా—
రాత్రిమీద నా గీతాన్ని స్పష్టంగా చెక్కేంతవరకు
ఈ రాత్రిని నే నెలా వుండచుట్టగలను

ప్రతి ఉదయమూ రాత్రియొక్క విస్తరణే
కానీ రూపురేఖలన్నీ మార్చు—చూపులూ మార్చే
ఈ గాలికళ్ళు తెరవండి
ప్రతిచోటా విహరిస్తున్న నా పేరునదిని చూడగలరు

31-4-78

# అంకితం

ఇదేమీ
కొత్త గాదు నాకు
నువ్వేమో
పొద్దుటిపూట చిగురుటాకుల్లా
టపటపా రెండు కన్నీటి బొట్లు రాల్చటం—
అవి
ఈ కాలే ఇనుం మీద
ఆవిరై పోవటం—
నువ్వొక నువ్వే
నేనొక నేనే—
విరుద్ధాలకి స్నేహమన్నది ఎంత నిజం!
నేను
వ్యక్తిలోంచి
జనశక్తిగా జన్మించినవాణ్ణి
జనదృష్టిగా రూపొందినవాణ్ణి—

నాకు
నాదన్నది లేదు
నేనొక ఆయుధాగారం
ఆయుధ కర్మాగారం—

నువ్వు
నీ కేంద్రం వద్ద

స్పందించే బిందువువి
నేను నీనుంచి
ప్రసారం కావాలని నీ వాంఛ—

నన్ను
నేను హరించుకుని
జనం ప్రయోజనం వద్ద సమర్పించుకున్న వాణ్ణి
ఊపిరి
విద్యుత్తుగా పుష్పిస్తున్న వాణ్ణి—
చూడు !
నా నేత్రా లెప్పుడూ పజలారే
ప్రజల జలజాల జన్మస్థానాలే—
నువ్వొ కన్నీటి బొట్టువే
రా ! నా కన్నీటిలో కలువ్—

# ముళ్ళు

మనిద్దరి మధ్యా
ముళ్ళు మొలుస్తున్నాయి కదూ—
పూలతో మొదలయింది కదూ
కథ మనిద్దరి మధ్య—

ప్రస్తుతపు ఈ పరిస్థితిలో
ముళ్ల తప్ప ఇంకేమీ మొలవ్వనీ
వ్యవస్థాగత జాడ్యాల మధ్య
ఆర్థిక అసమానతల మధ్య
ముళ్ల తప్ప ఇంకేమీ మొలవ్వనీ
నీకు తెలియదా?

మనిద్దరి మధ్యే కాదు
ఏ ఇద్దరి మధ్యైనా యింతే
ముళ్ల తప్ప ఇంకేమీ బతకవు

16-1-78

# కళ్ళలో అక్షరాలు

నా మౌనాన్ని
అర్థం చేసుకుంటానికి
నీ కళ్ళలో అక్షరాలు కదలాలి

నా కళ్ళను
చదవటానికి
నీ గుండెనిండా త్యాగం ఒలికి పారాలి

విశ్వమంత విశాలంగా
పరచుకుని ఎగురుతున్న
నా పక్షుల లాఘవాన్ని
కించిత్తయినా అంచనా కట్టాలంటే
ఏకోశానైనా
కొంచెం స్వేచ్ఛాతృష్ణ వుండాలి

నా జ్వలనాన్ని
తేరిపార జూడాలంటే
అసలు వేదంటూ వుండాలి నీలో

# పక్షి

నిశ్శబ్ద సముద్రాన్ని
పంకా మథిస్తోంది
కిటికీ కళ్ళు తెరచి
చీకటి చూపుల్తో గదిని నింపుతోంది
సిమెంటు ఆకాశం
ఇనుప దూలాల మీద
గుర్రుపెట్టి నిద్రపోతోంది.
గుడ్డి గవ్వలుగా కుర్చీలన్నీ
టేబుల్స్ తీరాల చెల్లాచెదురుగా పడివున్నాయ్—

ఒకే ఒక పక్షి
నిర్భీతిగా ఆకాశంలో విహరిస్తోంది
గది సముద్రాన్ని
పంకా పర్వతాన్ని
గవ్వల తీరాన్ని
కిటికీ కళ్ళ దిక్కుల దూరాన్ని
తీరిగ్గా సమీక్షిస్తోంది.
ఈ చీకటి అలల కావల
రాగల యుగాల సూర్యోదయాన్ని
ముందుగానే
వీక్షిస్తోంది.

# పిచ్చిగాడి పాట

నా నెత్తిమీద చంద్రుడు
వురితాడులా వేలాడుతున్నాడు
చావుకన్న శీతలంగా బాగా పాలిపోయి-
చుట్టూ రక్తంలేని తనం
తెల్లని విషపు కోరల్లా వెల్తురు తెరలు కదులుతూ
తెల్ల వెంట్రుకల్లాంటి రాత్రి
జీవచ్ఛవమైన
ఈ చంద్రకాంతి ప్రవాహంతో
ఏం చేయాలో తోచదు
ఇది ఒక రూపాయన్నా కాదు
ఏదో ఒక దేశపు ఇంత ఎర్రని గుండెముద్దయినా కాదు
కనీసం ఎండుగడ్డి లాంటి రొట్టెముక్కా కాదు.
సముద్రుడు విసిరేసిన
ఎందుకు పనికిరాని వస్తువు చంద్రుడు–
చంద్రుడు ఆకలవుతున్న ఖాళీబొచ్చె-
ఈ చంద్ర పళ్ళెంలో పచ్చిగడ్డన్నా మొలవదు
ఇంకేం చేయను
చావుతో మరణ శాసనం రాస్తున్నా
ఈ చంద్ర ఫలకం మీద

24–4–75

# రెండు కిటికీలు రెండు కళ్లలా

రెండు కిటికీలు రెండు కళ్ళలా
రెండు కళ్ళు రెండు కిటికీలలా
రైలు వెంట టెలిఫోన్ తీగలూ
తీగల మీద పిట్టలూ– పిట్టనోళ్ళలో దేవులాటలూ
రైలు వెంట సాగిపోయే మద్దెల దరువూ
సముద్రం రైలుకట్టై, రైలుకట్ట రైలై, రైలునేనై
పల్లెటూళ్లూ పంటకాల్వలూ
రైతు కూలీలూ నాగళ్ళూ పారలూ దమ్ములూ
ప్రతి వస్తువూ మాటలా నన్ను వెంటాడుతుంది
నిశ్శబ్దపునది గడియారం
నా చర్మం కింద నన్ను వేటాడుతుంది.
ఈ రైలు వాయిద్యం ముందు
నేను గణాచారినవుతా
రెండు కాళ్ళులేని కుంటోడు శరీరం మొత్తాని
తోసుకుంటూ వచ్చి నీ ముందు కొండై చేయిచాస్తాడు
అంతే
వాయిద్యం పగిలిపోతుంది
నాట్యం ఆగిపోతుంది.

1-11-78

# సూర్యోదయం

నెత్తిమీద
పంకాల్లో ఆలోచనల రెక్కలు
దుఃఖం
స్రవిస్తూ గుండెలో కిటికీకళ్ళముందు చేతుల
చుట్టూ
కుర్చీలన్నీ విచార వదనాల్తో
యాష్ ట్రేల ముందు—
వెలుత్తురు చీకట్లు
ఊకలా లోలోకుమిలి పోతున్న దృశ్యాల
చచ్చినవాడి కడుపులా
ఉబ్బుతున్న శూన్యం తాలూకు ఋతుపవనాల—

కిటికీ కావల
చెట్లు తోటలో చిద్విలాసంలో
ప్రాణంలో
ధైర్యంగా సాహసంతో నమ్మికతో
రేపులోకి చేతులెత్తి—

అక్కడంతా
ప్రాణాల పచ్చదనమే
విద్యుత్ ప్రవాహం విరగబూయటమే
కిటికీ
చువ్వల్ని చుట్టిన
చేతుల్లో ఆశాభాగీరధి—

గబుక్కున
లైట్లు వెలిగాయి
ఒక మూల
చీకటి చచ్చిపడివుంది కుప్పగా

# సముద్రం

అలల రేకులు సతతం
విచ్చుకుంటూ ముకుళించుకుంటుంటే
సముద్రం
నాకొక వింత మహాపుష్పంలా కన్పిస్తుంది.

అనవరతం
అలల రెప్పలు కొట్టుకుంటుంటే
సాగరం
నాకొక
క్షణమైనా కునుకుతీయని
వీరుని నేత్రంలా భాసిస్తుంది

12-9-77

# ఈ భూమి

ఈ భూమి ఎంత బాగుంది
నన్ను నేను మొలేసు కుంటున్నా—
ఈ కన్ను ఎంత బాగుంది
నన్ను నేను ఆత్మార్పణ కావించుకుంటున్నా-
నా రెండు కళ్ళను పీకి - వాటి స్థానే
రెండు భూగోళాల్ని నాటావు తల్లీ !

ఇప్పుడు నాలోంచి
సముద్రాలు వీస్తున్నాయి, పొలాలు లేస్తున్నాయి
అడవులు పహరా కాస్తున్నాయి
ఎడారులూ, మైదానాలూ. నదులూ. కాలవలూ
పగలూ, రేత్రులూ పూలూ ఫలాలూ—

ఇప్పుడు నేను గర్భిణీ స్త్రీని.

2-6-78

# పూలచెట్టులా మేఘాన్ని కుదిపి

పూలచెట్టులా మేఘాన్ని కుదిపి
నాలుగు చినుకులు రాలాక
భూమిని సుఖించడం నావృత్తి
నేను పుడమికి మొగుణ్ణి।

విజానికి ఎవడి వీర్యంతో
ఈ భూమి పునీతమవుతుందో
వాడిదే ఈ భూమి.

# హోటల్లో మంచం మీద

హోటల్లో మంచంమీద
దారి తప్పిన తూనీగల్లే
లైటు చుట్టూ ఎగిరెగిరి అలిసి—
హుసేన్‌సాగర్‌లో దుంగమీద
కదలకుండా కూర్చుని చేపలు పడుతున్నట్లు—
హోటల్లో మంచంమీద—

తెరచిన కిటికీలో గుండా
బయట ప్రపంచం లోనికి ప్రవహిస్తుంది—
ఎక్కడో రైలు పోతూవుంటుంది
పిట్ట ఎగురుతూ వుంటుంది
నిదానంగా వర్షం రాల్తూనే వుంటుంది
ప్రశాంతంగా భూమి దయనీయం అవుతూనే వుంటుంది
నది పంచప్రాణాల్ని దేశంమీదికి ప్రసరిస్తూనే వుంటుంది
అడుగులు తడబడటమూ, ఒకదాని వెంట
మరోటి పరుగెట్టటమూ
గుంటల్లో కప్పలు వేదాలు వల్లెవేయటమూ
చిన్నకారు కిర్రుమనడమూ, కుక్కపిల్ల మూలగటమూ
ఆకాశాని కడ్డంగా పిట్ట మెరుపై
అల్లుకోవడమూ
రిక్షాల్లో మంది బిళ్ళల్లా రిక్షావాళ్ళుండటమూ
నగరం పెట్టుకున్న సిమెంటు టోపీ ఫ్లైవోవర్ కింద
ఆడామగా పిల్లాజెల్లా కుంటీగుడ్డీ కుష్టు భ్రష్టూ

పందులూ కుక్కలూ ఆవులూ మేకలూ రొచ్చూరోతా-
నడవలేని దూరాలూ, కడలేని తీరాలూ అనంతరాత్రిళ్ళూ-

ఇది రాత్రే- అయితే ఇది ఏం దాచిందిగనక
మాట్లేసే వాడి మూడేళ్ళ కూతురు ఎర్రని ఎండలో
తిత్తి గొట్టటం దాచిందా
'సార్ పాలిష్' అంటూ ఐదేళ్ళవాడు
ప్రతినాకొడుకుని అడగటం దాచిందా
బండిలాగుతున్న డెబ్భైఏళ్ళ ముసలవాణ్ణి దాచిందా
ప్రమాదాల్నుంచి మనల్ని రక్షిస్తానికి
అండర్ గ్రౌండ్ సురక్షిత దోవలు నిర్మిస్తున్న
చిక్కి శల్యాలైన పసిపిల్ల తల్లుల్ని దాచిందా-
ఈ రాత్రి నా కంటికి నిదరపొరకాలేదు-

ఇది రాత్రే
నడచేటప్పుడు రోడ్డుని ఖూనీ చేస్తాడు
మాట్లాడే టప్పుడు మాటని ఖూనీ చేస్తాడు
మేల్కొన్నప్పుడు మెలకువని, నిద్రపోయే టప్పుడు నిద్రని
పని చేయించుకుంటున్నపుడు నమ్మకాన్ని ఖూనీ చేసిన వాడికి
కరెన్సీ వాహనం వాహకం___

వాలెంజో! నువ్వుకలగన్న 'మాస్' నాజనం కావాలి
వీళ్ళంతా సముద్రపొద్దున నిలబడి
లెమ్మంటే సముద్రమూ లేస్తుంది
విరిగిపడమంటే ఆకాశమూ విరిగి పడుతుంది

1-11-78

# దినదిన గండం నూరేళ్ళాయుష్షు

ఫాను బతికుంటే బాగుండు
ఫాను బతికుంటే బాగుండు—
మెగాఫిన్, మెగాఫిన్, మెగాఫిన్
మెగాఫిన్, మెగాఫిన్, మెగాఫిన్
ఫాను బతికుంటే బాగుండు
పచ్చిపక్క ఇంకా కళ్లు తెరచివుంటే బాగుండు
కన్నీటి కూజాలు అగ్నిగుండాలై తే బాగుండు
ఒంటిగంట
పడమటి అస్థిపంజరం వేళ్ళలో సగం చివిగిన చంద్రుడు
నాలుగురోడ్ల కూడలిలో నాసిరకపాట వెంటాడుతుంటే—
కిటికీల గాజుకళ్ళ వెనక లేత ఊదారంగు గుసగుసలు
ఎక్కడనుంచో గాలితల్లో చిక్కుకుని ఓపాటపువ్వు—
నగరం నగరం - నీ పక్కలో పడుకోనివ్వు
నగరం నగరం నీ గుండె హార్మోనియమ్ వాయించనివ్వు—
మెగాఫిన్, మెగాఫిన్
ఫాను బతికుంటే బాగుండు—
ఓవర్ బ్రిడ్జిమీద పారిపోతూ రైలు పారేసుకున్న
పొగల జ్ఞాపకాల పూసలు చెల్లాచెదరై దొర్లుతున్నాయి
ఒంటిగంట

ఒంటి గంట
నన్నుదాటి రెండుమూడు రిక్షాలు
నన్ను దాటి ఒకటాక్సీ రెండుకార్లు మూడు పిట్టలు

పదికాళ్ళ, ఎనిమిది సముద్రాలు పదకొండు పర్వతాలు
నన్నుదాటి నన్నుదాటి – రోడ్లన్నీ నన్నుదాటి
నన్నుదాటి దారులన్నీ కాలవలై– మాసిపోతున్న
కలల కలకలల మరకలై నన్నుదాటి–

నన్నుదాటి అంతా వెళ్ళిపోతున్నారు
నన్నుదాటి అంతా కదలిపోతుంది
నేనో నీటి మట్టంగానే మిగిలి—

కీళ్ళ కొట్టుముందు రెప్పలాడిస్తున్న నియాన్‌లైట్‌కింద
కట్టబీడీలు అగ్గిపెట్టె ఆరుగురు అనాథపిల్లలు—
పిచ్చుకలు తారట్లాడటాలు–మాట్లాడటాలు
నీటిమీద జారిజరిగి జరిగి జరిగి పోతున్న
ఆదోరకం నగరం పురుగులు – మాట్లాడటాలు
బెండుల్లా పైపైనే తేలటాలు – గుండెల్లో మునగటాలులేదు

నగరం: 'ఒంటిగంట కప్పు టీ' తెచ్చిపెట్టు
మెగాఫిన్ – మెగాఫిన్, – కాళ్ళు బుజానేసుకుని బజారులన్నీ
కళ్ళు కాళ్ళని బుజానేసుకొని ఏకాకి నీటిపాట తోడుగా

ఆగిన రిక్షాల్లోని ఆకలి యోనులూ
సగం చచ్చి సగంబతికి న హోటళ్ళ ఉపస్థులూ
ఆకాశమంతా శ్మశానం– తగలడుతున్న చంద్రుడు చితి–
జేవురు రంగు రాలుతున్న నగరం–
గుండె గుండెగలో పసుపూ సున్నం కలిపినట్టె, నిదరేది నిదరేది

నేత్రధనుస్సు శివారెడ్డి కవిత

రామ్‌ప్యారీ పాన్‌నోరూ కమ్మకమ్మగా పొటీనా
హీలింగ్ తలనొప్పి—మెగాఫిన్‌తో పేరులన్నీ
జర్జరితాలై — చేతనాలై — వసంతం గోరింటాకుచేతులై
జరజరా తొలగండి, జరజరా తొలగండి
బందొస్తున్నాదండీ— గుండెబందొస్తున్నాదండీ
తప్పుకోండ్రీ

ఇళ్ళల్లో దహన సంస్కారాలులేని శవాలు
బోనుకాని బోనుల్లో మిగిలిన జనాలూ—
ఓపెన్ పంజరాల్లో కిచకిచల కీరాలూ
ఆరాలు కావాలి— వివరాలు కావాలి— నగరం. నగరం—
మెహంటీలతోబాటు, పోలీసు ఠానాలతోబాటు
అనాధ వరండాలతోబాటు, టిబీ రిక్షాలతోబాటు
ప్లేవన్ల శయనాగారాలతోబాటు—కుక్కలు చింపుతున్న
విస్తళ్ళతో బాటు
అక్షరాలని కాలికిందేసి తొక్కుతున్న అధికారాల్తో బాటు
యూకలిప్టస్ విప్లవాలతోబాటు
కార్లూ బార్లూ వ్యాపార పునెస్త్రీలతోబాటు
పూజా పునస్కారాల బొడ్డుమీద మతోద్ధరణలతోబాటు
అంగాల ఆకురాలు కాలల్తోబాటు నగరం — రా - నాలోకిరా —

నాకలం మంచంపట్టెమీద కూర్చో
నా కాగితం చెవులో నీరహస్యం వూదు

ఫాను బతిక్తుంటే బాగుండు
ఫాను బతికుంటే బాగుండు
మెగాఫిన్ మెగాఫిన్ - రెండు చెంచాలుచాలు
గంగిగోవుపాలు గంటెడై నాచాలు—

స్క్రీన్‌లో సంధ్యలు - హత్యల్లో సంధ్యావందనాలు
ఆకలి ఆత్మహత్యల్లో పురోగమనాల - గమకాల గమకాలు -
కనపడని పిచ్చికుక్క రాత్రికాలు కరచింది
రక్తం కారుతున్న కాలితో రాత్రికుంటుకుంటూ
నగరం మీదుగా నడచి వెళ్ళింది—రోడ్లనీ
స్మృతుల జాడల్నీ వాడవాడల్నీ ఇరానీ హోటళ్ళనీ
కళ్ళతీరాల్నీ - క్షుత్ తల్పాల్నీ
వేవకు వనాంతరాలనీ - అసెంబ్లీల నుదుళ్ళనీ
సంసార నటీ గర్భ కుహరాల్నీ
గూడేయ బడుతున్న జీవితాలన్నీ - నెత్తుటిమరకలై
చావుబతుకుల్లో వున్న చంద్రుడి పక్కనే
హార్మోనియమ్ జలజలా దుఃఖిస్తోంది

ఇళ్ళముందూ - బజార్లోనూ మునిసిపాలిటీ కుండీల వద్దా
అక్కడక్కడా నగరమంతా పడివున్న చీకటి చిత్తుకాయితాల్ని
ఏరుకుంటూ - నాతల గోనెసంచిలో వేసుకుంటూ—

మెట్లమీంచి పడిపోతున్న పాటలు
మంచులో మంచాల్లో డిసెక్ట్‌చేయ బడుతున్న

జీవితాల శ్వాసలసముద్రాలు - వెంటాడుతుంటే
మళ్ళీ నాబతుకు ప్రియురాలి కటకటాల చేతుల్లోకి
ఇష్టంలేని మొగుడితో కాపరానికెళ్ళి నట్టు
నేనూ - నానీడా - నావాడా -

ఫాను బతికుంటే బాగుండు - నాతో బాటు
ఇంకో జీవి నా ఖాళీకుర్చీలో మొలి స్తే బాగుండు
మెగాఫిన్ - మెగాఫిన్
ఫాన్ బతికుంటే బాగుండు-
జొన్న కంకుల్ని నలిపి నాకూది పెట్టేది___

ఏకాంతమే అయినా - ఏ కాంతం నిండా
అర్థంలేని అర్థంకాని వాయిద్యాలు -
ఫిడేలుని మోకాటి తలమీద బద్దలు చేశారో
తబలా తల యాభైకోట్లముక్కలు చేశారో-
బద్దలయిన ఫిడేలు - ముక్కలయిన తబలా
వెరసి ఇండియా అయిందో ఏమో
ఏకాంతంకూడా నెత్తురులోడుతూనే దుఃఖిస్తూనే

మరణ శయ్యల హంసగీతాల చంద్రాతపాలు
నగరం పొత్తికడుపులో ఎనలేని నొప్పి-
ఇళ్ళమీద ఆకాశం బూడిదజల్లులా రాల్తోంది.

కనుటొమల పుస్తకాల్ని మూసేసి— దీపమార్పేసి
దుప్పటి కప్పేసుకో— తెల్లారబోతోంది
గంగిరెద్దు వేషం వేసుకో
తెల్లారబోతోంది.

30-3-77

జేబుగుడ్డ తడిపి నుదుటి ఏడారుల్ని తుడిచి

# పదయాత్ర

నేను గీతానికై బయల్దేరా
రాళ్ళు నాపాదాల కుత్తుక కోస్తున్నాయి.
నేనొక మనిషినికాదు
ఒక మనిషిగా ఉండటం ద్వేషిస్తా
నాకు నేను మాట్లాడుకోవటమంటే
నా జనంతో మాట్లాడటమే -
మాట్లాడే ఈనేను జనం యొక్క నోరు-
నాడికొట్టుకుంటున్నట్లు
గీతం కొట్టుకుంటుంది -
ఆశ్రయం లేని ఈ కెరటాలు నాలో పొంగుతాయి
ముఖాల్లేని ఈరాళ్ల నాలో ధ్వనిస్తాయి
కళ్ళు నేను
నేను అతని కళ్ళు ఆమెకళ్ళు -
శూన్యమైన ముఖంతో బావురుమంటున్న స్వప్నాల్లో
మిగిలిన కన్నీరునేను-
నేను అతని కళ్ళు - ఆమెకళ్ళు
తెల్లబోయిన ముఖాల దుప్పట్లు
పచ్చిక మైదానాలుగా వ్యాపిస్తాయి—
నేనేవాళ్ల—
రోడ్లుగా సాగిపోయే
నదులుగా కదలిపోయే
పంట పొలాలుగా పరివ్యాప్తమయ్యే వాళ్ళే నేను -

కలల్ని విత్తనాలుగా నాటుకున్న వాళ్ళే నేను
నేనేవాళ్ళు
ఈ కళ్ళమీదుగా ఎవడు నడచిపోతున్నాడో
సముద్రపు నీలికళ్ళమీదుగా, ఆకాశపు జాలికళ్ళమీదుగా-
తలుపు లెవడు మూస్తున్నాడో
శాశ్వతావసరాల ముఖాలమీద
వాంఛలమీద ఆశలమీద
చర్మం ఎడారుల్లో ఎండమావు లెవడు సృష్టిస్తున్నాడు
పదునెక్కుతున్న కత్తులు ఈ అడవులు
పగతో దహించుకు పోతున్న సైన్యాల్లా నాలో లేస్తున్నాయి
నా జీవన వాంఛా శత్రువెవడు -

నేనొక గీతంకోసం దేవులాడుతున్నా
నేనొక కణకెడు కంటినిప్పుకోసం వెదుకుతున్నా -
నా కలల్నీ, నావసంతాల్నీ, వాస్తవాలుగా అనువదించగల
కంటి నిప్పుకోసం వెదుకుతున్నా -
నేనొక వీరుడి హస్తంకోసం గాలిస్తున్నా—
పట్టుకో దగిన కలలు నాకోర్కెలు - నా గీతాలు
పదయాత్రలు చేస్తున్నా -
జీవితం
ఒక వత్తిడి, ఒకతూపు, ఒక ధార
ఒక వందేళ్ళ అవసరం
ఒక మనిషి నిరుపయోగంలో చచిపోడు -
అన్ని చెట్లలో ప్రవహించే జీవరసం

నేత్రధనుస్సు శివారెడ్డి కవిత

అన్ని నదుల్లో అంతర్భూతమైన అంగారం –
నేనిక్కడ ప్రతిధ్వనిస్తున్నా –
సాగుచేయబడని పొలాల కోపాగ్ని నేనిక్కడధ్వనిస్తున్నా–
తలొంచుకొని పడుండే డేబులుగాగాక
ఒక మరఫిరంగిగా రూపుదాల్చుకోనీ –
తీన్నాక మల్లిగా ఎదగనీ
రక్తం తాగేవాడి రక్తాన్ని రుచిచూసే ముల్లుగా ఎదగనీ –
నేను సైన్యాన్ని కంటున్నా
నేను సైన్యాన్ని కంటున్నా–
నేను అంటరాని వాణ్ణి, కరువు దెబ్బతిన్న రైతుని
నేను రోడ్డుని, దుమ్ముని, ఎరువుని –
పాలిచ్చే ఈ దేశపు స్తనాన్ని –
నేనొక గొడ్డుచాకిరిని, చచ్చేపనిని
ఖాకీనోటిని, అనంత వేదనని –
నేను పాడియావు, పంటగింజలు
పళ్ళదుకాణాలు, సముద్రంతీరాలు, షిప్ యార్డ్‌లు
రైలు మార్గాలు పారిశ్రామిక వాడలు
కర్మాగారాలు, లాభాలు, నగరాలు, నాగరికతలు
నేను సంపదలు సౌందర్యాలు, సాహిత్యాలు
నేను ఆకలితో వెడుతున్నా
నేను దిగంబరంగా వెడుతున్నా

8–2–76

# రోడ్డువళ్ళుగా సాగిపోతానా

నా అంత విషాదమైంది
నా అంత వినోదమైంది–
రోడ్డు వళ్ళుగా సాగిపోతానా
నా శోక నేను తొక్కుకుంటూ
నాకన్ను నేను పొడుచుకుంటూ–
ఒక కేక పొడిచినప్పుడూ
ఒక చూపు నాటినప్పుడూ
నా రక్తం నిండా కరెంటుతీగలు–
ఒక మడుగెదురవుతుంది
దాని కన్నుని కోడిగుడ్డులా నామీద పగలకొడుతుంది
ఒక వాగు నాపక్కగా కొంతదూరం నడచి
నా వెన్నుపూసలో సంలీన మౌతుంది.
పోతూపోతూ నా కన్ను నొకదాన్ని అక్కడనాటిపోతా
తర్వాత అక్కడ సముద్రం తయారవుతుంది.
ఒక మాటతో ఎవరో నెత్తిమీద కొడతారు
హిమాచలంలా ఎదిగి గంగానదిలా దేశంమీద పడిపోతా–
మూసిన కొట్టూ, తెరచిన వాకిలీ, అరమూసిన కిటికీ
తలకిందులైన కూరగాయలబండీ, చచ్చిపడ్డ కాకిపిల్లా
దిక్కులేని పిల్లిపిల్లా, ముళ్ళపొదమీద గాలికి కొట్టుకునే
చీరముక్కా–
ఈతచెట్టు మొదట్లో పగిలిన లాంతరు గ్లాసూ
పారేసిన పాతచేటా, తెగిపోయిన ఎద్దు పట్టెడా

నేత్రధనుస్సు శివారెడ్డి కవిత

చెట్టు నుంచి ఒక్కొక్కటే రాలిపడుతున్న పూతాపిందే
హోటల్ వానప్రస్థమూ
ఇరానీ విజ్ఞాన సర్వస్వమూ—
నా యీ సంచిని ఖజానేసుకుని
పోస్టుమాన్‌ని అయి—
నా అంత విషాదమూ—
నా అంత వినోదమూ—
గ్లాసులో ఆకులూ పూలూ, టేబుళ్ళకింద సిగరెట్ పీకలూ
యాక్వేరియమ్ మీనఖైదీలు
గర్భగుడిలో బద్దలౌతున్న పొత్తికడుపులూ
పెరుగుదోటకూరా. పేదకళ్ళాపీ, సచివాలయమూ
నాగలి కర్రమీద రైతు ఆత్మహత్యా
శాంతిదూత దొడ్లో సుఖప్రసవమూ
ఫినాయిల్ ఎనిమాలతో గదులూ—
మెట్లు నాకు బరువు
కన్నీటిబొట్టు నాగర్భ శిశువు—
కాయితాల మీద కపురుకంపు కవిత్వాలు
జన్మనక్షత్రాల కోనేటితానాల శాస్త్రజ్ఞులు
నాకు బరువు.
కాళ్ళులేని చేతుల్లేని చెప్పుల్తో, శిరసులేని బరువుల్తో
ఖాళీజేబు జీవితం నా పరువు.
అక్కడి కక్కడే తిరిగే చిన్నపిల్ల ప్లాస్టిక్ రైలూ
కాలి మడతల్లో పెరిగి వృక్షాలౌతున్న ఏనుగుదురదలూ

బొడ్డుని భూమిగా భ్రమించే చూపుల షట్పదాలూ
అందాల దీవుల అపార కారుణ్యాలు
నయాపైసా దానధర్మాల మహాగర్వాలు
పెదవుల పాలగచ్చు నియాన్ లైట్ల నృత్యపాటవాలు
నా పెదవిని నేను కొరుక్కోవటాలు–
వింతకాదూ
వీధిని నేను ఖైదీనినేను
రాదను వీనుగా కలిగిన ఎదను–
జలధరం భూధరం ఖేచరం నారాచం నారెక్కలకింద
కప్పులేని గుడిసెలోని ముసలిదాని కుంపట్లోని కన్ను
నా కూత.
కర్మాగారాల కార్మికవాడల కార్మొయిళ్ళనీ
వెక్కిళ్ళ మధ్య నిలబడ్డ వీధిలాంతరు అంతరంగాల్ని
బందీ అయిన అడవిపాటల్నీ
పళ్ళెటూళ్ళో పశువుల్నీ, పశువుల్ని కడుగుతున్న చేతుల్నీ
రైతుకూలీ కళ్ళ ముంజూరుల వర్షంధారల్నీ
రాత్రుళ్ళనీ, రాత్రుళ్ళనే గుక్కపట్టి ఏడుస్తున్న
అనాథ బాలబాలికల ప్రాణాల్నీ మోస్తున్నా–
నా పక్కన నుంచొని నా మీద వసంతాన్ని కురుస్తున్న
విద్యుత్ దీపాన్నీ
నా నాడుల్తో పెనవేసిన చెట్ల వేళ్ళ సంగీతాన్ని
అన్నింటినీ మోస్తున్నా–
ఎక్కడో ఏ విద్యార్థి కంటిలోనో
ఏ పలుగు వంటిలోనో పుట్టిపెరుగుతున్న
సూర్యుడి కోసం నిరీక్షిస్తున్నా

13-8-78

# స్మృతి దవనం

స్మృతి దవనం.
ఆలోచనల కొండలోయల్లో
ఏటిగట్టున పచ్చిగడ్డి మొవ్వల్లో రాత్రి ఛాయలు
'డాన్‌క్విగ్జోట్'లా ఫాన్‌మీదికి
దండయాత్ర చేసిన పిచ్చుకదావు నాచేతిలో-
స్మృతి వెన్నంటే నీడ
స్మృతికూడా ఒకరకం స్పృహే-
నుదుటి నాగేటి చాళ్ళలో
కంటి సంకీర్ణాటవిలో
సినిమాహాలు పక్క స్తంభంకిందో
మేడమెట్లు మీదనో కుండీపక్కనో - ఎక్కడో
ఒకచోట ఆకలిచలితో మూలగై మిగిలిన
కుక్కపిల్ల
లోన్నించి-బావిలోని నీళ్ళలా పైపైకి చూస్తుంది.
ఎన్నిగాయా లెన్నిముద్ర లెన్ని ఆక్రోశాలు
ఎన్ని పతనాలు ఎన్ని పాకులాటలు-
అన్నింటినీ ఏకి దారమైమిగిలి-
మఠంలో మిగిలిన కొనూపిరి దీపం
టింగ్ టింగ్ తంబూరా తీగై -
రాత్రిళ్ళ ఒడ్లమధ్య ఉదయం నది ప్రవహిస్తుంది-
ఎండాకాలం నదుల్లో అక్కడక్కడ మిగిలిన

నీటి పాయల్లోని మెలకువల చేపలు
ఇంకా పిచ్చుక నా అరచేతిలో
తెరచిన కళ్ళలో మలిసంధ్యల నిశ్చలన చిత్రాలు
ముల్లుని పొదగటం
పూవుని కనటం
భిన్న పదార్థాల భిన్న సంగీతాలు భిన్నరాగాల
కూడలి కదలి - ఈతలమూట -
నా తల్లో పాదాలు మొలుస్తాయి
పాదాల్లోంచి తోటలు లేస్తాయి
తోటల్లోంచి సముద్రాలు వీస్తాయి
సముద్రం అలల్ని పుస్తకాల భూముల్లో నాటతాం-
పంటలన్నీ కంకులకు బదులు తలకాయల్ని పండుతాయి—
పదార్థమైన నాకు భిలమేది
భూమైన నాకు చావేది
పిచ్చుక ఇంకా నా అరచేతి కళ్ళలో
దారులుగా డొంకలుగా—
దారులు డొంకలు చిగిర్చిన పల్లెలుగా



# జల దర్శనం

అలలొచ్చి మనసు లోపలి పొరల్ని తాకుతాయి
కాంతిమంతమైన నిశ్శబ్దమే మిగుల్తుంది.

* * * *

దూరాన దీపమొక్కటి పిల్లల తల్లిలా భాసిస్తుంది.
నా లోపలి బావి నేనే తవ్వుకుంటా—
ఏ చట్టు పగిల్తే జలదర్శనమౌతుందో చెప్పలేను
చూపుపడి జారిపోయేటంత నునుపును భరించలేను
గ్లాసులో హృదయం చూపులా జ్వలిస్తుంది, చలిస్తుంది.
ఏరులాంటి చేమొచ్చి బల్లతుడిచి పోతుంది
అద్దాలలోంచి జారిన ఎండ
నా చొక్కామీద, తలమీద ముఖంమీదా, కళ్ళమీదా
కలం పట్టుకున్న చేతి మునివేళ్ళమీదా నర్తిస్తోంది.
నిగూఢవాంఛ లాంటి గాలి
లోలోనే "పాట పాట"ని పాడుతోంది, పాడుతుంది.
ఒక పచ్చని వాతావరణంలో మునిగిపోతూ—
ఒక పసిపాప పాదాల చిరుగజ్జెల మోతలు
ఈ మూలో ఆ మూలో ఏ మూలో పారాడుతున్నాయి—
చట్టులో డైనమైట్ నాటుతున్నా
తెప్పొద్దున తప్పక జల దర్శన మౌతుంది.

—కె. శివారెడ్డి

కె. శివారెడ్డి

# నేత్ర ధనుస్సు

కొందర్ని కడిగితే బతుకుతారు
కొందర్ని తగలేస్తే బతుకుతారు
జాలెందుకు
తగలెయ్యాల్సి వచ్చినప్పుడు
తగలెయ్యటమే ధర్మం
నారు పీకే చేలో నాటుటానికి భయమెందుకు
చేద పల్కరింపుతో చేలో నీళ్ళు ప్రవహిస్తేనే
బావిలో నీళ్ళు బతికినట్లు లెక్క